# నాడీజంఘుని కథ

(సరళ వ్యాఖ్యాన సహితం)


వ్యాఖ్యాత

**డా॥ దావులూరి కృష్ణకుమారి**



ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

**2018**

**NADIJANGUNI KATHA**
with Commentary

*Commentary* by
**Dr. Davuluri Krishna Kumari**

T.T.D. Religious Publications Series No. 1297


*First Print :* 2018

*Copies :* 2000

*Published by :*
**Sri Anil Kumar Singhal**, I.A.S.
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati

*D.T.P.*
Publications Division
T.T.D., Tirupati.

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati - 517 507

# ముందుమాట

భారతీయ సనాతన సంస్కృతీ, సంప్రదాయాలకు వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు మూలాధారాలుగా ఖ్యాతిగాంచాయి. వేదాలలోని సారాన్ని రంగరించి భగవాన్ వేదవ్యాసుల వారు మహాభారత ఇతిహాసాన్ని పంచమవేదంగా తీర్చిదిద్దారు. మహాభారతం మన జాతీయ కావ్యం. చతుర్విధ పురుషార్థాల సాధనకు కావలసిన విజ్ఞానమంతా ఇందులో చక్కగా వేదవ్యాసుల వారు ఇమిడ్చారు. మహాభారతం పంచమవేదంగానే కాక భారతీయ విజ్ఞాన శాస్త్ర సర్వస్వంగా ప్రశస్తికెక్కింది.

వేదవ్యాసుల వారు భారత కథను జయేతిహాసంగా తీర్చిదిద్ది తన శిష్యులద్వారా వివిధ లోకాలలో వ్యాపింపజేశారు. వైశంపాయనుడు జనమేజయ మహారాజుకు ఈ కథను వినిపించాడు. అలా వినిపించగా పెంపొందిన కథను భారతం అన్నారు. ఆ తరువాత రోమహర్షణుని కుమారుడైన ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో సత్రయాగం చేస్తున్న శౌనకాది మహామునులకు వివరించాడు. మునులడిగిన ప్రశ్నలకు ఉగ్రశ్రవసుడు చెప్పిన కథార్థాలతో కలిపి భారతం **"మహాభారతం"** అయ్యింది.

**"యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"**

ఇందులోఉన్నది ఎక్కడైనా ఉంటుంది. ఇందులో లేనిది ఎక్కడా ఉండదు – అని సూత పౌరాణికులు శౌనకాది మహామునులకు మహాభారత ప్రాశస్త్యాన్ని వివరించాడు.

పంచమవేదంగా, భారతీయ విజ్ఞాన శాస్త్రంగా ఖ్యాతిగొన్న సంస్కృత వ్యాసభారతాన్ని ఆదికవి నన్నయ, కవిబ్రహ్మ తిక్కన, ప్రబంధ పరమేశ్వరుడు ఎఱ్ఱన ఆంధ్రీకరించారు.

తిరుమల తిరుపతి దేవస్థానములు ధర్మప్రచారంలో భాగంగా కవిత్రయ విరచిత శ్రీమదాంధ్ర మహాభారతానికి తెలుగులో సుప్రసిద్ధ పండితులచే చక్కటి వ్యాఖ్యానాన్ని వ్రాయించి 15 సంపుటాలుగా ముద్రించి తెలుగు ప్రజలకు అందించింది. తి.తి.దే. ముద్రించిన కవిత్రయ విరచిత శ్రీమహాభారతం విశేష ప్రజాదరణను పొంది ఇప్పటికే దాదాపు 25,000లకు పైగా ప్రతులు అమ్ముడుపోయాయి.

ఇదివరకు తి.తి.దే. ముద్రించిన కవిత్రయ విరచిత శ్రీమదాంధ్ర మహాభారతంలోని ప్రశస్తమైన నలోపాఖ్యానం, సావిత్రి ఉపాఖ్యానం వంటి ఉపాఖ్యానాలను, సుప్రసిద్ధ ఘట్టాలను, కథలను వ్యాఖ్యానంతోపాటు ప్రత్యేకించి చిన్న చిన్న పుస్తకాలుగా ముద్రిస్తే నేటి తరం సమాజానికి చాలా ఉపయోగకారి అవుతుందని తి.తి.దేవస్థానములు సంకల్పించింది. ఆ సంకల్పానికి ప్రతిరూపమే ఈ భారతోపాఖ్యానాలు గ్రంథమాల. ఈ గ్రంథమాలలో భాగంగా ఉదంకోపాఖ్యానం, గరుడోపాఖ్యానం, యయాతి చరిత్ర, దుష్యంతోపాఖ్యానం, శిశుపాలుని కథ, నలోపాఖ్యానం, ధర్మవ్యాధోపాఖ్యానం, రామోపాఖ్యానం, సావిత్ర్యుపాఖ్యానం, కీచకుని కథ, శ్రీకృష్ణరాయబారం, అంబోపాఖ్యానం, హంసకాకీయోపాఖ్యానం, నాడీజంఘుని కథ, బ్రాహ్మణగీతలు అనే 15 శీర్షికలను ఎంపిక చేసి తెలుగు రాష్ట్రాలలో సుప్రసిద్ధులైన పండితులచే చక్కటి పీఠికలను వ్రాయించి, ముద్రించి ప్రజలకు అందుబాటులోనికి తీసుకువస్తున్నది. ఇందులో భాగమే ప్రస్తుతం మీకందిస్తున్న **నాడీజంఘుని కథ.**

భక్తమహాశయులు, సాహితీ ప్రియులు ఈ గ్రంథమును ఆదరిస్తారని మనసార కోరుకుంటూ...

సదా శ్రీవారిసేవలో...

కార్యనిర్వహణాధికారి
తి.తి.దేవస్థానములు, తిరుపతి



# పీఠిక

(వ్యాసుడు రచించిన సంస్కృత భారతాన్ని నన్నయభట్టు, తిక్కన సోమయాజి, ఎఱ్ఱాప్రగడ అనే కవిత్రయం తెలుగులో పద్యగద్యాలుగ అనువదించారు. ఉభయకవి మిత్రుడయిన తిక్కన సోమయాజి అనువదించిన భారతంలో శాంతిపర్వంలోని తృతీయాశ్వాసంలో 472వ పద్యంనుంచి 527వ వచనం వరకు (57 పద్యగద్యాలలో) 'భీష్ముడు ధర్మరాజునకు నాడీజంఘుని చారిత్రంబు సెప్పుట', 'నాడీజంఘుడు దుష్టబ్రాహ్మణునిచే మృతుడై మరల జీవించుట' అనే రెండు శీర్షికలతో 'నాడీజంఘుని కథ' ఉంది. పద్యగద్యాలలో తిక్కన రచించిన ఆ కథను ప్రస్తుతం సరళ, వ్యావహారిక – వచనంలో అందించబడింది. మంచి స్నేహితుడిని సంపాదించు, చేసిన మేలు మరచిపోవద్దు అనే నీతిని ఈ కథ బోధిస్తుంది).

పూర్వం గౌతముడు అనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు తన కులవృత్తినీ, గౌరవాన్నీ వదలి దుర్మార్గ ప్రవర్తనతో జీవిస్తుంటాడు. అతడు ఒక బోయవనితను పెళ్లాడతాడు. బోయవారితో కలిసి గౌతముడు వేటాడేవాడు, మాంసం తినేవాడు. అతడు బాగా సుఖాలకు అలవాటుపడతాడు. ధనసంపాదనకు వర్తకులను అనుసరించి దేశసంచారం చేయడం మంచిదని భావిస్తాడు. ఒక వర్తకుల గుంపుతో అతడు దేశాంతర ప్రయాణం చేస్తుంటాడు.

అలా ప్రయాణం చేస్తుండగా ఒకనాడు కొండకోనలలో ఒక ఏనుగు ఆ వర్తకుల గుంపును తరిమికొడుతుంది. అప్పుడు ఆ గుంపంతా చెల్లాచెదరై తలా ఒక దిక్కుకు వెళతారు.

గౌతముడు ఉత్తరం దిక్కు తోవలో చాలాదూరం వెళ్లి డొంకల నడుమ దట్టంగా, గుబురుగా, ఎత్తుగా, వెడల్పుగా, గుండ్రంగా, అందంగా ఉన్న ఒక మర్రిచెట్టు కిందికి చేరుకుని అక్కడ అలసట తీర్చుకుంటాడు.

గౌతముడు మర్రిచెట్టుకింద సేద తీర్చుకుంటున్న సమయాన అక్కడకు ఒక పెద్దకొంగ వచ్చింది. ఆ కొంగ బ్రహ్మదేవుడి దయకు నోచుకుంది. ఆ కొంగకు నాడీజంఘుడు, రాజధర్ముడు అని పేర్లు. ఆ మర్రిచెట్టే ఆ కొంగలరాజుకు నివాసం. బయటకు వెళ్లిన నాడీజంఘుడు తన నివాసమైన మర్రిచెట్టు దగ్గరకు చేరుకుని అక్కడ సేదతీరుతున్న గౌతముడిని చూస్తాడు.

నాడీజంఘుడు గౌతమునితో "ఓ బ్రాహ్మణోత్తమా! ఎక్కడినుండి ఎక్కడకు ఏం పనిమీద వెళుతున్నావు. నీవు నా అతిథివి, నిన్ను చూచి చాలా సంతోషం కలిగింది. మీ సంగతులు తెలియజేయండి" అన్నాడు. అప్పుడు గౌతముడు – "నేను మధ్యదేశీయుడను, నాపేరు గౌతముడు. ఒక మహనీయ చరిత్రుడయిన ఉత్తమ బ్రాహ్మణునికి కొడుకును. అయితే నేను వేదాధ్యయనం చేయలేదు. మా జాతి కర్మలను మానివేశాను. కామానికి వశుడనై ఒక బోయవనితను పెళ్లాడాను. పేదరికంలో అలసిపోయాను. ఒక వర్తకసంఘంవారితో కలిసి మరో దేశానికి వెళుతున్నాను. దట్టమైన అడవిలో ప్రయాణిస్తుంటే ఒక ఏనుగు మా గుంపును తరుముతూ చంపబోయింది. ఆ గుంపు చెల్లాచెదరయి పరిగెత్తారు. నేనూ పరుగెత్తి, దారితప్పి, అదృష్టం కొద్దీ నీ నివాస స్థలమైన ఈ మర్రిచెట్టు దగ్గరకు చేరుకుని నిన్ను దర్శించగలిగాను" అన్నాడు.

గౌతముని మాటలు విన్న నాడీజంఘుడు "మంచిదే – నీ బీదతనాన్ని నివారించుకోవడానికి నీవు నీ దేశాన్ని వీడి వచ్చావని తెలుస్తోంది. నీ పేదరికాన్ని పోగొడతాను, బాధపడకు. నా ఆతిథ్యాన్ని స్వీకరించు" అంటూ నాడీజంఘుడు గౌతమునికి రుచిగా గంగానదిలో ఉండే చేపలను తీసుకవచ్చి వాటిని కాల్చి వడ్డించాడు. తీయని అడవిపళ్లను పెట్టాడు.



తన అతిథిగా భావించిన ఆ బ్రాహ్మణుడిని భోజనంతో సంతృప్తి పరచాడు. కొంగలరాజు నాడీజంఘుడూ, బ్రాహ్మణుడు గౌతముడూ కొంతసేపు మాటలాడుకుంటూ హాయిగా నిద్రలోకి వెళ్లిపోయారు. తెల్లవారింది. గౌతముడిని చూచి నాడీజంఘుడు "మనిషికి ఉండే బీదతనం పోవడానికి స్నేహితుడూ, వెండీ, బంగారం, ఆలోచన అనే నాలుగింటినీ కారణంగా బృహస్పతి చెప్పాడు. ఈ నాలుగింటిలోనూ ఓ బ్రాహ్మణా! మిత్రుడు గొప్పవాడు. నేను కశ్యపుని సంతతికి చెందినవాడిని. నేను నీతో చెలిమి చేస్తే అంతులేని సిరులు కలుగకుండా ఉంటాయా! నాకు విరూపాక్షుడు అనే స్నేహితుడొకడున్నాడు. అతడు రాక్షసరాజు. అతడి పట్టణం మధువ్రజం. ఇక్కడికి మూడు ఆమడల దూరంలో ఉంటుంది. ఆ పట్టణానికి తొందరగా చేరుకునే మార్గం ద్వారా అక్కడకు గబగబా వెళ్లు. ఆ రాక్షసరాజును ఆశ్రయించు. అతడికి నిన్ను నేను పంపించినట్లు చెప్పు. అతడు చాలా సంతోషించి బంగారం, మణులు ఇచ్చి నిన్ను సత్కరిస్తాడు" అని చెప్పి ఆ పట్టణానికి వెళ్లే దారిని చూపించాడు.

గౌతముడు మధుప్రజపురానికి వెళ్లి రాజుగారైన విరూపాక్షుడిని దర్శించాడు. ఆ రాజుతో "నేను నాడీజంఘుని ఆప్తమిత్రుడిని, ఆతడు పంపగా మీరు ధనసహాయం చేస్తారని వచ్చాను" అని చెప్పాడు. విరూపాక్షుడు గౌతముడిని తేరిపార జూచాడు. ఆ బాపడిని నీచుడిగా భావించాడు. "నీ కులం, విద్య, ప్రవర్తన ఉన్నదున్నట్లు చెప్పండి" అని విరూపాక్షుడు గౌతముడిని అడిగాడు. గౌతముడు ఏమాత్రం జంకక తన వృత్తాంతాన్నంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. అప్పుడు విరూపాక్షుడు కూడా శారీరక మానసిక వికారాలకు లోనుగాక, "ఈ బ్రాహ్మణుడు ఎలాంటి వాడయితేనేం, నాడీజంఘునితో స్నేహమే ఈ బ్రాహ్మణుడికి యోగ్యతనిస్తుంది. కనుక ఇతడికి తృప్తిగా ధనం ఇస్తాను" అని నిర్ణయించుకున్నాడు.

గౌతముడికి ఆహారం, దుస్తులు సమకూర్చమని తన సేవకబృందాన్ని కొందరిని నియమించాడు రాజుగారైన విరూపాక్షుడు. ఆ మరునాడు కార్తికపౌర్ణమి. విరూపాక్షుడు తన ఇంట్లో వేలమంది బ్రాహ్మణులకు బంగారు పళ్లెరాలలో భోజనాలు ఆరగించే ఏర్పాటు చేయించాడు. వారు కానుకలు ఎక్కువగా గ్రహించడానికి అనువైన కర్మలు ఆచరించాడు.

పెద్దమనసుతో విరూపాక్షుడు బ్రాహ్మణుడైన గౌతమునికి కూడా ఎన్నో సేవలు చేసి, తృప్తికరమైన భోజనాన్ని పెట్టి, మోయలేనంత బంగారాన్నీ, రత్నాలనూ మనస్ఫూర్తిగా సమర్పించాడు.

గౌతముడు రాజుగారికిచ్చిన ధనాన్ని భారమైనా కూడా మోసుకుని నాడీజంఘుడు ఉండే మర్రిచెట్టు దగ్గరకు చేరుకున్నాడు. గౌతముని చూచి నాడీజంఘుడు సంతోషించాడు. అలా ధనంతో తిరిగివచ్చిన బ్రాహ్మణుని చూచి నాడీజంఘుడు చాలా తృప్తిపడ్డాడు. దొప్పలలాంటి తన రెక్కలతో మెల్లగా విసరి గౌతముని బడలికను పోగొట్టి, ఆకలి తీర్చాడు నాడీజంఘుడు. రాత్రి అయింది. నాడీజంఘుడు ఆదమరచి నిద్రపోయాడు.

దుష్టబుద్ధి అయిన గౌతముడు మరుసటిరోజు ప్రయాణాన్ని గురించి దుర్మార్గంగా ఇలా ఆలోచించాడు – "ఈ కొంగ (నాడీజంఘుడు) బాగా కొవ్వుపట్టింది. ఒళ్లుమరచి నిద్రపోతుంది. దీన్ని చంపి, దీని మాంసాన్ని ముక్కలుగా చేసి తీసుకువెళితే రేపటి ప్రయాణంలో ఆహారంగా తీసుకోవచ్చు" ఒక కర్రతో కొంగతలమీద బాగా చితకబాదాడు దుష్టబ్రాహ్మణుడు. కొంగకు ప్రాణం పోయిందని నిర్ధారించుకుని దాని ఈకలన్నీ పెరికేశాడు. పీకను చీల్చాడు. పేగులు బయటకు లాగి మాంసాన్ని మూటకట్టుకున్నాడు.



మధువ్రజపురంలో విరూపాక్షుడు తెల్లవారగానే లేచాడు. "జాము పొద్దెక్కింది. అయినా నాడీజంఘుడు ప్రతిరోజువలె ఈ రోజు ఎందుకు రాలేదు!? కల్మష మెరుగనివాడూ, అందరినీ నమ్మేవాడూ అయిన నా మిత్రుడు నాడీజంఘుని నీచ బ్రాహ్మణుడైన గౌతముడు ఏమైనా చేశాడేమో!" అనుకున్నాడు విరూపాక్షుడు. అలా ఆలోచించిన విరూపాక్షుడు మిత్రుడైన కొంగలరాజు నాడీజంఘుని వెతకడానికి తన పరివారాన్ని పురమాయించాడు. ఆ పరిజనం నాడీజంఘునికోసం వెతకీ వెతకీ ఆ కొంగ ఈకలూ ఎముకలగూడూ మొదలయినవాటిని గుర్తించి ఆ సంగతిని రాజుగారికి కబురు పంపించారు.

గౌతముడు ఎటువైపు వెళ్లాడో తెలుసుకుని విరూపాక్షుని పరివారం వేగంగా పరుగెత్తి వెళ్లి అతడిని పట్టుకున్నారు. ఆతడి రెక్కలు విరచికట్టి రాజుగారి సమక్షానికి తెచ్చారు. అప్పుడు రాజు విరూపాక్షుడు "వీడు చేసిన మేలును మరచినవాడు. వీడిని నా దరిదాపులకు తేవద్దు. వీడిని వెంటనే చంపి తినండి" అని రాక్షస సేవకులకు చెప్పాడు. అపుడు ఆ రాక్షసభటులు "ఈ పాపిదేహాన్ని తినడానికి మేమేం నీతిలేని వాళ్లమా! ఇలాంటివాడిని తింటే మాకు పాపం అంటుకుంటుంది" అని ఆ బాపడిని భక్షించడానికి ఇష్టపడరు. అపుడు విరూపాక్షుడు "మీరు వీడిని తిన్నాసరే తినకపోయినా సరే! చేసిన మేలును మరచిన ఈ నీచుడిని నా ఎదుటికి ఎందుకు తెచ్చారు" అన్నాడు.

విరూపాక్షుని భటులు గౌతముని బాగా రక్తం చిందేలా గాయపరిచ పడదోశారు. ఆ పాపి శరీరాన్ని తినడానికి ఆకలతో నకనకలాడుతున్న కుక్కలమంద అక్కడకు వచ్చింది. అయితే ఆ కుక్కలు ఆ పాపాత్ముని శరీరాన్ని పసిగట్టి ముట్టకుండానే తిరిగి వెళ్లిపోయాయి. చేసిన మేలును మరచేవారి శరీరమాంసాన్ని కుక్కలుగూడా ముట్టక రోస్తాయని ఆగమాలు చెప్తున్నాయి.

విరూపాక్షుడు నాడీజంఘుని ఎముకలగూడును తెప్పించాడు. స్నేహితులతో కలిసి తానూ గౌరవంగా ఆ ఎముకలగూడుకు దహనసంస్కారాలు తలపెట్టి తలకొరవి పెట్టాడు. అపుడు అక్కడకు దేవేంద్రుడు వచ్చాడు. ఇంద్రుని చూశాడు విరూపాక్షుడు. "నా మిత్రుడు నాడీజంఘుని (రాజధర్ముడిని) బ్రతికించండి" అని ఇంద్రుని వేడుకున్నాడు విరూపాక్షుడు. "విరూపాక్షా! నీ చెలికాడు నాడీజంఘుడు బ్రహ్మదేవునికి కూడా స్నేహితుడే! నీ కీ విషయం ఇంతవరకూ తెలియదా! అతడిని గురించి ఏడవడం ఎందుకు? అతడు ప్రతినిత్యం తన దగ్గరకు రావాలని బ్రహ్మ విచారిస్తుంటాడు. నాడీజంఘునికి నీవు దహనసంస్కారం ముగించి నీవు ఇలా వచ్చాక ఆ చితిమంటలకు దగ్గరలో ఒక ఆవు తన దూడకు ఎంతోప్రేమతో పాలు ఇస్తూ ఉండగా పాలు చీకుతున్న దూడ నోటినుండి నురుగు తంపరలో ఒకటి గాలికి ఎగిరి చితిమీద పడింది. ఆ నురుగు పడిన వెంటనే నాడీజంఘుడు తిరిగి బ్రతికాడు. మునుపటి వలెనే అదేరూపంలో నాడీజంఘుడు వస్తూ ఉన్నాడు. ఇదంతా ఆ బ్రహ్మదేవుని లోకాతీతమైన దయామహిమ!" అని ఇంద్రుడు చెపుతూ ఉండగానే కొంగలరాజు నాడీజంఘుడు అక్కడకు రానే వచ్చాడు. విరూపాక్షుడు చాలా సంతోషించాడు.

ఇదంతా జరగడానికి ముందే బ్రహ్మ చెప్పిన మాట ప్రకారం ఇంద్రుడు గౌతముడిని తాళ్లతో బంధించాడు. నాడీజంఘుడు (రాజధర్ముడు) ఆ బ్రాహ్మణునికి తన కారణంగా కలిగిన దురవస్థకు తట్టుకొనలేక పోయాడు. ఆతడిని బంధవిముక్తుని చేయుమని ఇంద్రుడిని వరం అడిగాడు నాడీజంఘుడు.

బ్రహ్మదేవుని దయవల్ల ఈ వరాన్ని అనుగ్రహించవచ్చని ఇంద్రుడు దివ్యజ్ఞానంతో తెలుసుకున్నాడు. వెంటనే గౌతముడిని విడిచిపెట్టి కొంగలరాజు నాడీజంఘుని కోరికను తీర్చాడు.



రాక్షసరాజయిన విరూపాక్షుని దగ్గర తీసుకవచ్చిన ధనాన్ని బ్రాహ్మణుడు గౌతముడికి తిరిగి అందజేశారు. ఆ బ్రాహ్మణుడు ఆ ధనాన్ని స్వీకరించి వెళ్లాడు. ఇంద్రుడు స్వర్గలోకానికి వెళ్లిపోయాడు. విరూపాక్షుడు బకరాజు నాడీజంఘుని సంతోషంగా సాగనంపాడు. నాడీజంఘుడు తానుండే మర్రిచెట్టును చేరుకున్నాడు.

భీష్మాచార్యులు తన మనుమడైన ధర్మరాజుకు కాశ్యపగౌతమోపాఖ్యానం చెప్పి ఇలా అన్నాడు. "ధర్మరాజా! బ్రాహ్మణుడిని చంపిన వాడికైనా పాపనిష్కృతి ఉంటుంది. కానీ, చేసినమేలును మరచిపోయినవాడికి మాత్రం పాపవిముక్తి ఉండదు.

స్నేహితునికి కీడుచేయాలనుకోవడం చేసిన మేలును మరచిపోవడాని కన్నా మించిన పాపం. ఈ రెండు రకాలవారినీ వైరం పెట్టుకొని అయినా సరే వారిని వదలుకోవడం మంచిది. స్నేహితుడు ఇహపర సౌఖ్యాలను సమకూర్చగలడు. మిత్రుడూ, ధనం – ఈ రెండింటిలో ధనానికన్నా మిత్రుడే మిన్న అని పెద్దలమాట. ఎవరైనా మేలును పొందాలనుకుంటే ఉత్తమజన్ముడూ, సుగుణాలు కలవాడూ, మంచిస్నేహం కావాలనుకునే వాడూ అయిన వ్యక్తితో పొత్తుపెట్టుకునాలి. ఆ మిత్రుని మనసు అలరించేటట్లు, అంటే నొప్పించని రీతిలో ప్రవర్తించాలి. చేసినమేలు మరచిపోవడం, స్నేహితునికి కీడు తలపెట్టడం – అనేవి రెండూ మహాపాపాలు.

మంచి మిత్రుడిని సంపాదించడం, మేలు చేయడం అనే నీతిని బోధించే ఈ ఉపాఖ్యానాన్ని భీష్ముడు ధర్మరాజుతో చెప్పాడు.

**– వైద్యం వేంకటేశ్వరాచార్యులు**

# నాడీజంఘుని కథ

## భీష్ముఁడు ధర్మరాజునకు నాడీజంఘుడి చరిత్రంబు సెప్పుట
## (సం.12-162-281)

**చ. 'విను మొక బ్రాహ్మణుండు కులవృత్తము పెంపుఁ దొఱంగి బోయదా**
**నినొకత నాలిఁ జేసికొని, నెమ్మిఁ గిరాతులఁ గూడి వేఁటకుం**
**జనుఁ దిను మాంస మద్దురితసక్తుఁడు భ ఓగపరుండు గావునన్**
**ధనము ఘటింపఁగాఁ దగు విధం బని చూచి వణిగ్జనంబుతోన్. 1**

**ప్రతిపదార్థం :** వినుము= విను; ఒక బ్రాహ్మణుండు= ఒక బ్రాహ్మణుడు; కులవృత్తము= కులవృత్తము; పెంపున్= గౌరవాన్ని; తొఱంగి= విడిచిపెట్టి; బోయదానిన్+ఒకతన్= ఒక బోయతను; ఆలిన్+చేసికొని= పెళ్ళాంగా ఉంచుకొని; నెమ్మిన్= సంతోషంతో; కిరాతులన్+కూడి= బోయవారితో కలిసి; వేఁటకున్+చనున్= వేటాడటానికి వెళ్ళుతాడు; మాంసమున్= మాంసాన్ని; తినున్= తింటాడు; ఆ+దురితసక్తుఁడు= పాపాన్ని కూడబెట్టుకొన్న ఆ పాపి; భోగపరుండు= సుఖాన్ని మరిగాడు; కావునన్= కాబట్టి; ధనము= సంపత్తి; ఘటింపఁగాన్= కూడబెట్టుకొనటానికి; తగు విధంబు+అని= సరైన తీరు అని; చూచి= అనుకొని; వణిక్+జనంబుతోన్= వర్తకుల గుంపుతో.

**తాత్పర్యం :** వెనుకటికి ఓ బాపడు. తన తాతముత్తాతలనాటి నుండి వస్తున్న కులవృత్తి గౌరవాన్ని వదులుకొని ఒక బోయదాన్ని పెళ్ళాడాడు. బోయవారితో కలిసిపోయి వేటాడే వాడు, మాంసం తినేవాడు. ఆ పాపాలపుట్ట బాగా సుఖాలకు మరిగి డబ్బు సంపాదించ టానికి తగిన పద్ధతి ఇది అనుకొన్నాడు. వర్తకుల గుంపుతో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. చెలిమిసేసి కొందఱు గోమట్లు బేహారంబు వెంట దేశాంతరంబునకుం జనఁ దానును వారితోడం గూడి పోవం బోవ గిరిగహన దుర్గమస్థలంబున నొక్కవనగజంబు. 2**

**ప్రతిపదార్థం :** చెలిమి+చేసి= నేస్తంకట్టి; కొందఱు+కోమట్లు= కొంతమంది వైశ్యులు; బేహారంబు+వెంటన్= వర్తకం కొరకు; దేశాంతరంబునకున్= మరొక రాజ్యానికి; చనన్= పోగా; తానును= తాను (బ్రాహ్మణుడు) కూడా; వారితోడన్ కూడి= వారితో కలిసి; పోవన్ పోవన్= పోగా పోగా; గిరి= కొండలలో; గహన= అడవులలో; దుర్గమ= పోవటానికి వీలులేకుండా ఉన్న; స్థలంబునన్= ప్రాంతంలో; ఒక్క వనజంబు= ఒక అడవి ఏనుగు.

**తాత్పర్యం :** అందులో కొంతమంది కోమట్లు వ్యాపారం నిమిత్తం మరొకదేశానికి పోగా బ్రాహ్మణుడు వారితో కలిసి పోయాడు. అట్లా పోతుండగా కొండల్లో కొనల్లో ఒక అడవి ఏనుగు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. సాతులోని కుటికి జనముల నున్మద ।**
**లీల నేలఁ బెట్టి కాలఁ జమరఁ**
**జొచ్చుటయును భీతివిచ్చి నల్దిక్కులఁ ।**
**బఱచి రెల్లవారుఁ బటు రయమున. 3**

**ప్రతిపదార్థం :** సాతులోనికిన్+ఉటికి= వర్తకజనసమూహంమీద పడి; జనములన్= జనాన్ని; ఉన్మదలీలన్= వెర్రిత్తినట్లు; నేలన్+పెట్టి= నేలమీద పడేసి; కాలన్= కాలితో; చమరన్= తొక్కి చంపటం; చొచ్చుటయును= మొదలుపెట్టగా; భీతిన్= భయంతో; విచ్చి= విడివడి; ఎల్లవారున్= అంతమంది; పటురయమునన్= గబగబా; నల్దిక్కులన్= నాలుగు మూలలకు; పఱచిరి= పరుగెత్తిపోయారు.

**తాత్పర్యం :** ఆ బిడారులోని జనాన్ని పిచ్చెత్తినట్టు నేలమీదపడేసి కాలితో తొక్కి చంపటం మొదలు పెట్టింది. ఆ గుంపంతా బెదరిపోయి తలో దిక్కుకు చెల్లాచెద రయింది.



**క. ఆయనయుఁ గాందిశీకుం ।**
**డై యుత్తర దిక్కువాఱె నతి దూరముగా;**
**నా యెడ నొక మార్గము గని ।**
**పోయెను దాను నట పోవఁ బోవం గెలనన్. 4**

**ప్రతిపదార్థం :** ఆయనయున్= ఆ బ్రాహ్మణుడూ; కాందిశీకుండు+ఐ= జడసిపోయి తోవా తెన్నూ తెలియకుండా పరుగెత్తినవాడక్మ, ఉత్తరదిక్కు= ఉత్తరం వైపునకు; అతిదూరముగాన్= చాలా దూరంగా; పాఱెన్= పరుగుతీశాడు; ఆ+ఎడన్= అపుడు; ఒక మార్గము+కని= ఒక తోవ చూచి; పోయెన్= వెళ్ళాడు; తానున్= ఆ బ్రాహ్మణుడు; అట= అక్కడి నుండి; పోవన్ పోవన్= పోగా పోగా; కెలనన్= ప్రక్కనే.

**తాత్పర్యం :** ఆ బ్రాహ్మణుడూ భయంకొద్దీ దిక్కుతోచక పరుగెత్తాడు. ఉత్తరం వైపుగా చాలా దూరం పోయి ఒక దోవ చూచాడు. అతడు ఆ త్రోవలో వెళ్ళగా ఆ ప్రక్కనే. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. పొదల తఱచున జొంపమై పొడవుఁ బఱపుఁ ।**
**గలిగి వట్రువఁదనమునఁ జెలువు మిగిలి**
**యున్న వటభూరుముఁ గని యుల్ల మచట ।**
**నిలువఁ గోరిన నామ్రాని నీడఁ జేరి. 5**

**ప్రతిపదార్థం :** పొదల తఱచునన్= చిత్తొత్తుగా ఉన్న తుప్పలతో; జొంపమై= జీబుగా ఉండి; పొడవున్= ఎత్తూ; పఱపున్= వెడల్పూ; కలిగి= ఉండి; వట్రువ+తనమునన్= గుండ్రంగా ఉండటంచేత; చెలువు మిగిలి= అందగించి; ఉన్న; వట భూరుహమున్= ఒక మర్రిచెట్టును; కని= చూచి; ఉల్లము= మనస్సు; అచటన్= ఆ చెట్టు దగ్గర; నిలువన్+కోరినన్= ఉండాలనిపించగా; ఆమ్రాని నీడన్+చేరి= ఆ మర్రినీడకు పోయి.

**తాత్పర్యం :** దట్టంగా ఉన్న డొంకలమధ్య గుబురుగా ఉన్న ఓ మర్రిచెట్టును చూచాడు. అది చాలా ఎత్తుగా బాగా వెడల్పుగా ఎంతో గుండ్రంగా అందంగా ఉన్నది. అక్కడ కాసేపు నిలబడా లనిపించి ఆ చెట్టుక్రిందకు పోగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వనలతల కుసుమగంధము ।**
**గొని సుడివడు గాడ్పు డప్పిఁ గొండొక దేర్పం**
**దనుపార నచటఁ గూర్చుం ।**
**డె నతం డట్లుండ నచ్చటికి లలితగతిన్. 6**

**ప్రతిపదార్థం :** వనలతల= అడవి తీగెల; కుసుమ గంధము= పూలసువాసన; కొని= గ్రహించి; సుడివడు= చుట్టుకొంటున్న; గాడ్పు= గాలి; డప్పిన్= అలసటను; కొండొక తేర్పన్= కొద్దిగా ఊరట కలిగించగా; అతండు= ఆ బ్రాహ్మణుడు; తనుపారన్= తృప్తిగా; అచటన్= ఆ మర్రినీడన; కూర్చుండెను= చతికిలపడ్డాడు; అట్లు+ఉండన్= అట్లా కూర్చుని ఉండగా; అచ్చటికిన్= ఆ చెట్టుదగ్గరకు; లలితగతిన్= అందంగా నడుచుకుంటూ.

**తాత్పర్యం :** అడవిపూలవాసనను ఇముడ్చుకొన్న సుడిగాలి అతడి అలసటను కొంచెం పోగొట్టింది. ఆ బ్రాహ్మణుడు తనివితీరా ఆ చెట్టు నీడన కూర్చున్నాడు. అంతలో అక్కడికి చక్కగా నడుచుకుంటూ. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. ఒక్కమహాకంబు వచ్చె ; నది పద్మభవునకుం బ్రసాద పాత్రం బగుచు నాడీజంఘుండును రాజధర్ముండు నను పేళ్ళం బరఁగు; నాకొక్కెరకు నమ్మఱ్ఱి నివాసంబై యుండు నప్పక్షి యట్లేతెంచి యవ్విప్రునిం గాంచి ప్రియంబు దలకొను చూడ్కినాదరించి. 7**

**ప్రతిపదార్థం :** ఒక్కమహాబకంబు= ఒక పెద్ద కొంగ; వచ్చెన్= వచ్చింది; అది= ఆ కొక్కెర; పద్మభవునకున్= బ్రహ్మకు; ప్రసాద పాత్రంబు+అగుచున్=



దయకు నోచుకున్నదవుతూ; నాడీజంఘుండును= నాడీజంఘుడు; రాజధర్ముండున్= రాజధర్ముడు; అనుపేళ్ళన్+పరఁగు= అనే పేర్లతో ఒప్పే; అట్లు+ఏతెంచి= అట్లా వచ్చి; ఆ విప్రునిన్+కాంచి= ఆ బ్రాహ్మణుడిని చూచి; ప్రియంబు తలకొను= ఇష్టం తెలిపే; చూడ్కిన్= చూపుతో; ఆదరించి= ఆదరణ చూపి.

**తాత్పర్యం :** ఒక పెద్ద కొంగ వచ్చింది. ఆ కొంగ బ్రహ్మదయను నోచుకొన్నది. నాడీజంఘుడు, రాజధర్ముడూ అనేవి ఆ కొక్కెర పేర్లు. ఆ మర్రిచెట్లు మీదే ఆ కొంగ ఉండేది. ఆ కొంగ అట్లా వచ్చి బ్రాహ్మణుడిని చూచింది. ప్రేమతో ఆదరించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఎందుండి యేమి పనికై ।**
**యెందుల కరిగెదవు భూసురేశ్వర! ప్రీతిం**
**బొందితి నినుఁ గని; తగియెడు ।**
**విం దయితి నాకు; నీదు విధముం జెపుమా!'8**

**ప్రతిపదార్థం :** భూసుర+ఈశ్వర!= ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా!; ఎందున్+ఉండి= ఎక్కడినుండి; ఏమిపనికై= ఏం పనిమీద; ఎందులకున్= ఎక్కడకు; అరిగెదవు?= వెళ్ళుతున్నావు?; నినున్+కాని= నిన్ను చూచి; ప్రీతిన్= సంతోషాన్ని, పొందితిన్= అనుభవించాను; నాకున్= నాకు; తగియెడు= తగ్గ; విందవు+అయితి= అతిథివి అయ్యావు; వనీదు విధమున్= నీ తీరును; చెపుమా!= చెప్పవలసినది.

**తాత్పర్యం :** 'ఓ బ్రాహ్మణోత్తమా! ఎక్కడినుండి ఎక్కడికి ఏం పనిమీద వెళ్ళుతున్నావు; నిన్ను చూచి సంతోషించాను. నాకు తగ్గ అతిథివి. నీ సంగతులు తెలియజెప్పుము.'

**వ. అని యడిగిన నతం 'దేను మధ్యదేశీయుండ' గౌతముండ నొక్క మహనీయ చరిత్రుని పుత్త్రుండ; నాలస్యంబున వేదాధ్యయనాది విప్రకర్మ**

**విరహితుండ నయి కామలోలత్వంబున బోయత యిల్లాలుగా బోయలం గలిసియుండి, పేదఱికంబునకు నలసి భేహారంబు వెంట నొక్కసాతుం గూడి పరదేశంబున కరుగుచోట గిరి గహన దుర్గమ ప్రదేశంబున. 9**

**ప్రతిపదార్థం :** అని అడిగినన్= అని అడుగగా; అతండు= ఆ బ్రాహ్మణుడు; ఏను= నేను; మధ్యదేశీయుండన్= మధ్యదేశ నివాసిని; గౌతముండన్= గౌతముడు అనే వాడిని; ఒక్క మహనీయ చరిత్రుని; మంచినడవడికలవాడి; పుత్త్రుండన్= కొడుకును; ఆలస్యంబునన్= సోమరితనంవలన; వేద+అధ్యయన+అది= వేదం వల్లించటం మొదలైన; విప్రకర్మ= బ్రాహ్మణ కర్మలు; విరహితుండను+అయి= మానివేసిన వాడినై; కామలోలత్వంబునన్= కామంమీద తృష్ణతో; బోయత= బోయకాంత; ఇల్లాలుగాన్= పెళ్ళాంగా; బోయలన్= బోయవాళ్ళతో; కలిసి+ఉండి= కూడి ఉండి; పేదఱికంబునకున్= పేదతనానికి; అలసి= వేసారి; బేహారంబు వెంటన్= వ్యాపారం వెంబడి; ఒక్కసాతున్+ కూడి= ఒక వర్తకులగుంపుతో కలసి; పరదేశంబునకున్= మరొక రాజ్యానికి; అరుగుచోటన్= వెళ్ళే ప్రదేశంలో; గిరి= కొండలవలన; గహన= అడవులవలనా; దుర్గమ= కాలుపెట్టలేని; ప్రదేశంబున= తావులో.

**తాత్పర్యం :** అని అడుగగా 'నాది మధ్యదేశం. నా పేరు గౌతముడు. నేను ఉత్తమ బ్రాహ్మణుడి కొడుకును. నేను సోమరిపోతునై వేదాలు వల్లించటం వంటి మా జాతికర్మలను మానివేశాను. కామంలో పడి ఒక బోయదాన్ని పెళ్ళాడాను. బీదరికంతో విసిగిపోయి వరక్తకం వెంబడి ఒక బిడారుతో కలిసి మరో దేశానికి వెళ్ళుతున్నాను. కాలుతీసి కాలుపెట్టలేనంత దట్టంగా ఉన్న కొండలలో అడవులలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. వనకరియొక్కటి యా సా।**
**తునకుఁ గవిసి జనయయంబుఁ ద్రుంపఁ దొడఁ గుడున్**
**విను మెల్లవారునుం గను।**
**కనిఁ బఱచిరి భీతి నేను గాననభూమిన్. 10**



**ప్రతిపదార్థం :** వనకరి= అడవి ఏనుగు; ఒక్కటి; ఆ సాతునకున్= ఆ వర్తకుల గుంపుమీదికి; కవిసి= ఉరికి; జనచయంబున్= గుంపును; త్రుంపన్= చంపటానికి; తొడఁగుడున్= మొదలు పెట్టగా; వినుము = వినుము; ఎల్లవారునున్= ఆ జనమంతా; కనుకనిన్= తత్తరపాటుతో; పఱచిరి= పారిపోయారు; ఏను= నేనూ; భీతిన్= భయంతో; కానన భూమిన్= అడవిలో.

**తాత్పర్యం :** ఒక అడవి ఏనుగు ఆ బిడారుమీద పడి చంపబోయింది. ఆ గుంపులోని వారంతా తత్తరపడి పరుగెత్తారు. నేనూ భయపడి అడవిలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. పరచి దిక్కు దప్పి భాగ్యంబు కల్మి నీ।**
**దైన నిలయమునకు నరుగుదేరఁ**
**గంటి' ననిన 'మేలుగాక! నీ దారిద్ర్య।**
**మపనయింతుఁ; జింత యపనయింపు. 11**

**ప్రతిపదార్థం :** పరచి= పరుగెత్తి; దిక్కు తప్పి= దారి తప్పి; అరుగుదేరన్= రాగా; భాగ్యంబు కల్మి= అదృష్టంకొద్దీ; నీదైన= నీకు సంబంధించినది అయిన; నిలయమునకున్= తాపలాన్ని; కంటిన్= చూచాను; అనినన్= అనగానే; మేలు+కాక= (కొంగ) మంచి జరుగుగాక; నీ దారిద్ర్యమున్= నీ లేమిని; అపనయింతున్= పోగొట్టుతాను; చింత= దుఃఖాన్ని; అపనయింపు (ము)= వదలిపెట్టుము.

**తాత్పర్యం :** పరుగెత్తి త్రోవ తప్పాను. నా అదృష్టంకొద్దీ నీవు ఉండే ఈ మర్రిని చూచాను.' అనగానే ఆ కొంగ, 'మంచిదే నీ బీదతనాన్ని పోగొట్టుతాను. నీవు బాధపడకుము.

**వ. అంతకునియ్యాతిథ్యంబుఁగయికొను' మని రుచిమంతంబులగు మందాకినీ మీనంబులు సుపక్వంబులుసేసి, మధురంబు లగు**

**వన్యఫలంబులు దెచ్చి తృప్తియగునట్లుగా నతనికి నాహారవిధి యొనర్చి, రాత్రి యగుటయుం బల్లవ పుష్పసాంద్రం బగు శయనంబు గల్పించి యబ్బకపతి యద్ధరణీసురుని తోడి 12**

**ప్రతిపదార్థం :** అంతకున్= అంతలోపల; ఈ ఆతిథ్యంబున్= ఈ నా అతిథిసేవలను; కయికొనుము+అని= పొందుమని; రుచిమంతంబులు+అగు= చవులూరించే; మందాకినీ= గంగానదిలోని; మీనంబులు= చేపలను; సుపక్వంబులు+చేసి= బాగా నిప్పులమీద కాల్చి; మధురంబులు+అగు= తీయటి; వన్యఫలంబులు= అడవి పళ్ళు; తెచ్చి= తీసికొని వచ్చి; తృప్తి+అగునట్లుగాన్= తనివితీరేటట్లు; అతనికిన్=బ్రాహ్మణుడికి; ఆహారవిధి= భోజన కార్యక్రమం; ఒనర్చి= చేసి (ముగించి); రాత్రి అగుటయున్= పొద్దుపోవటం వలన; పల్లవ= చిగురుటాకులతో; పుష్ప= పూలతో; సాంద్రంబు+అగు= ఒత్తుగా పరచిన; శయనంబు= పడకను; కల్పించి= కూర్చి, ఏర్పరచి; ఆ+బకపతి= ఆ కొంగలరాజు రాజధర్ముడు; ఆ+ధరణీసురినితోన్= ఆ బ్రాహ్మణుడితో; సముచిత= తగిన; సల్లాపంబులనున్= సంభాషణలతోనూ; సుఖనిద్రనున్= ఆదమరచిన నిద్రతోనూ; ఆ+రాత్రి= ఆ రేయి; కడపి= వెళ్ళబుచ్చి; వేగటయున్= తెల్లగా తెల్లవారగానే; ఆ+విప్రున్= ఆ బ్రాహ్మణుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం :** తన ఆతిథ్యాన్ని అందుకొనుమన్నది. మంచిరుచిగా ఉండే గంగానదిలోని చేపలను కాల్చి తెచ్చింది. తీయటి అడవిపళ్ళు పెట్టింది. అతిథి బ్రాహ్మణుడు తృప్తి పడేటట్లు భోజనం పెట్టింది. పొద్దు పోవటంతో చిగురుటాకులతోనూ, పూలతోనూ, ఒత్తుగా పక్కను సిద్ధం చేసింది. ఆ కొంగలరాజు ఆ బ్రాహ్మణుడు ముచ్చటలతోనూ హాయి అయిన నిద్రతోనూ ఆ రాత్రి గడిపారు. తెల్లవారగానే ఆ బ్రాహ్మణుడిని చూచి కొంగ. (తరువాతి పద్యంతో అన్వయం).



**క. 'విను ! మిత్రుండును రజితముఁ,**
**గనకము బుద్ధియును నాల్గుకారణములు మ**
**ర్త్యుని దారిద్ర్యము వాయుట,**
**కని దేవగురుండు సెప్పె నన్నిటిలోనన్. 13**

**ప్రతిపదార్థం :** విను= వినుము; మిత్రుండును= చెలిమికాడూ; రజతమున్= వెండీ; కనమున్= బంగారమున్నూ, బుద్ధియును= ఆలోచనా; మర్త్యుని= మనిషి; దారిద్ర్యము= లేమితనం; పాయుటకున్= పోగొట్టటానికి; నాల్గు కారణములు= నాలుగు హేతువులు; అని; దేవగురుండు= బృహస్పతి; చెప్పెన్= చెప్పాడు; అన్నిటిలోనన్= ఈ నాలుగింటిలో.

**తాత్పర్యం :** 'వినుము. మనిషి పేదరికం పోవటానికి స్నేహితుడూ, వెండీ, బంగారమూ, ఆలోచనా అనే నాలుగింటిని కారణాలుగా దేవగురువు బృహస్పతి చెప్పాడు. వీటి అన్నింటిలోనూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మిత్రుం డెక్కుడు కాశ్యప,**
**పుత్త్రుఁడనగు నేను నీకు భూసురవర ! స**
**న్మైత్రి యనుష్ఠించెద నటె,**
**పాత్రము గాకుండుదే యపార శ్రీకిన్. 14**

**ప్రతిపదార్థం :** భూసురవర!= బ్రాహ్మణోత్తముడా!; మిత్రుండు= స్నేహితుడు; ఎక్కుడు= దొడ్డవాడు; కాశ్యప పుత్రుఁడను+అగు= కశ్యపుడి కొడుకునైన; నేను= నేను (నాడీజంఘుడిని); నీకున్= నీతో; సన్మైత్రి= మంచి స్నేహం; అనుష్ఠించెదను+అటె= చేస్తున్నవాడిని అవుతుండగా; అపార శ్రీకిన్= అంతులేని సిరులకు; పాత్రము+కాకుండుదే= తగినవాడిని కాకపోతావా!

**తాత్పర్యం :** ఓ బాపనయ్యా! మిత్రుడు గొప్పవాడు. కశ్యపుడి సంతానంలోని వాడనైన నేను నీతో చెలిమి చేస్తూ ఉంటే అంతులేని సిరిసంపదలకు యోగ్యుడివి కాకుండా పోతావా?

**తే. నా సఖుండు విరూపాక్ష నామధేయుఁ; ।**
**డతని పురము మధువ్రజ; మదియు మూఁడు**
**యోజనము లిచ్చటికి; దాని కుల్ల తెరువు ।**
**వట్టి వేచని యాదైత్యభర్తఁ గనుము. 15**

**ప్రతిపదార్థం :** విరూపాక్ష నామధేయుఁడు= విరూపాక్షుడనే పేరుగలవాడు; నా సఖుండు= నా చెలిమికాడు; అతని పురము= అతడి పట్టణం; మధు వ్రజము= మధు వ్రజం; అదియున్= ఆ పట్టణం కూడా; ఇచ్చటికిన్= ఇక్కడకు; మూఁడు యోజనములు= మూడామడల దూరం; దానికిన్= మధు వ్రజానికి; ఉల్ల తెరువుపట్టి= అంతదూరం అంత దగ్గరా కానీ తోవను బట్టి; వేచని= వడిగా వెళ్ళి; ఆ దైత్యభర్తన్= ఆ రాక్షస రాజును; కనుము= చూడుము.

**తాత్పర్యం :** నాకు విరూపాక్షుడనే మిత్రు డొకడు ఉన్నాడు. మధువ్రజం అతడిపట్టణం అది ఇక్కడకు మూడామడల దూరంలో ఉంటుంది. దానికి మరీ దూరం మరీ దగ్గర కాని త్రోవ వెంబడే గబగబా వెళ్ళుము. ఆ రాక్షసరాజును ఆశ్రయించుము.

**క. కాంచి యతనితో నేఁ బు ।**
**త్తెంచితినని చెప్పు; మతఁ డతిప్రీతుండై**
**కాంచనమును రత్నంబులు ।**
**నంచితుఁగాఁ జేసి యిచ్చు నప్పుడ నీకున్.' 16**

**ప్రతిపదార్థం :** కాంచి= చూచి; అతనితోన్= ఆ విరూపాక్షుడితో; ఏన్= నేను; పుత్తెంచితిని+అని= పంపించాను అని; చెప్పుము= చెప్పుము; అతఁడు= ఆ రక్కసిదొర; అతి ప్రీతుండు+ఐ= ఎంతో సంతోషించినవాడై; కాంచనమును= బంగారమూ; రత్నంబులున్= మణులూ; అంచితుఁ



గాన్+చేసి= గౌరవించినవాడిగా చేసి; నీకున్= నీకు; అప్పుడ= అప్పటికప్పుడే; ఇచ్చున్= ఇస్తాడు.

**తాత్పర్యం :** విరూపాక్షుడిని చూచి అతడితో నేను పంపించినట్లు చెప్పుము. అతడు ఎంతో సంతోషిస్తాడు. బంగారం, మణులూ ఇచ్చి నిన్ను సత్కరిస్తాడు'.

**క. అని యప్పురి దెస సెప్పినఁ ।**
**జని యాతం డతనిఁ గాంచి సముచిత భంగిన్**
**వినిపించె రాజధర్మున ।**
**కనుగలమగు సఖుఁడ ననియు నతని పనుపునన్. 17**

**ప్రతిపదార్థం :** అని= అని; ఆ+పురిదెస= ఆ పట్టణం పోయే దిక్కును; చెప్పినన్= తెలుపగా; చని= వెళ్ళి; ఆతండు= ఆ బ్రాహ్మణుడు; అతనిన్= ఆ రక్కసి దొరను; కాంచి= చూచి; సముచిత భంగిన్= తగిన రీతిలో; రాజధర్మునకున్= నాడీజంఘుడికి; అనుగలము+అగు= అనుకూలుడనైన; సఖుఁడన్= మిత్రుడిని; అనియున్= అని కూడా; వినిపించెన్= చెప్పాడు; అతని పనుపునన్= నాడీజంఘుడు పంపటంవలన.

**తాత్పర్యం :** అంటూ ఆ కొంగ మధువ్రజం పోయే దిక్కును చెప్పింది. ఆ దారివెంబడి వెళ్ళి ఆ బ్రాహ్మణుడు విరూపాక్షుడిని చూచాడు. నేను నాడీజంఘుడికి ఆప్తమిత్రుడిని అని చెప్పాడు. అతడు పంపబట్టి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అరుగుదెంచితి ననియు, ధనార్థిననియు, ।**
**నిట్లు వినిపించుటయు, రాక్షసేశ్వరుండు**
**దేఱకొనఁజూచి, యాత్మనిప్పాటుఁ డధముఁ ।**
**డగుట దోఁచుచు నున్నది; యడుగ వలయు. 18**

**ప్రతిపదార్థం :** అరుగుదెంచితిని= వచ్చాను; అనియున్= అనీ; ధన+అర్థిన్+ అనియున్= ధనాన్ని కోరివచ్చాననీ; ఇట్లు= ఇట్లా; వినిపించుటయున్=

చెప్పగానే; రాక్షస+ఈశ్వరుండు= రాక్షసరాజు; తేఱకొనన్+చూచి= తేరిపార చూచి; ఆత్మన్= మనస్సులో; ఈ+పాఱుఁడు= ఈ బ్రాహ్మణుడు, అధముఁడు+అగుటన్= నీచుడు అని; తోఁచుచున్+ఉన్నది= అనిపిస్తున్నది; అడుగవలయున్= అడిగి చూడాలి.

**తాత్పర్యం :** డబ్బుకోరి వచ్చాను' అని బ్రాహ్మణుడు చెప్పగానే విరూపాక్షుడు అతడిని తేరిపార చూచాడు. లోలోపల 'ఈ బ్రాహ్మణుడు నీచుడుగా అనిపిస్తున్నాడు. సంగతేమిటో అడిగి తెలిసికొనాలి.'

**వ. అని తలంచి. 19**

**తాత్పర్యం :** అని అనుకొని.

**క. 'కులమును విద్యయు వృత్తముఁ ।**
**గల రూ పెఱిఁగింపు' మనినఁ గలఁగక తన్నుం**
**దెలియంగఁ జెప్పె విప్రుం ।**
**డలఘుం డగు నసురపతియు నవికృతుఁ డగుచున్. 20**

**ప్రతిపదార్థం :** కులమును= వంశాన్నీ; విద్యయున్= చదువునూ; వృత్తమున్= నడతనూ; కలరూపు= ఉన్నదున్నట్లుగా; ఎఱిఁగింపుము= తెలుపుము; అనినన్= అని అడగగానే; విప్రుండు= బ్రాహ్మణుడు; కలఁగక= కలతచెందక= తన్నున్= తన సంగతిని; తెలియంగన్ చెప్పెను= ఎరుకపరిచాడు; అలఘుండు+అగున్= గొప్పవాడవటంవలన; అసురపతియున్= రాక్షసరాజు విరూపాక్షుడు కూడా; అవికృతుఁడు+అగుచున్= ఎట్లాంటి (శారీరక, మానసిక) వికారాలకు లోనుకాని వాడవుతూ.

**తాత్పర్యం :** 'నీ వంశం, నీ చదువు, నీ నడవడి ఉన్నదున్నట్లుగా చెప్పుము' అని అడిగాడు. అందుకు ఆ బ్రాహ్మణుడు ఏ మాత్రం జంకలేదు. తన సంగతి అంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. అపుడు విరూపాక్షుడు కూడా



ఎట్లాంటి (మానసిక, శారీరక) వికారాలకు లోబడనివాడవుతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఇతఁ డెట్టిఁ డైన నేమగు?**
**నతనికి సఖుఁ డట్టె బకమహత్తర సఖ్యం**
**బితనిం బాత్రముఁ జేయదె! ।**
**యితనికిఁ దృప్తి యగునట్టు లిత్తు ధనంబుల్21**

**ప్రతిపదార్థం :** ఇతఁడు= ఈ బాపడు; ఎట్టిఁడు+ఐనన్= ఎట్లాంటివాడైనా; ఏమి+అగున్?= ఏమవుతుంది?; అతనికిన్= అతడికి (రాజధర్ముడికి); సఖుఁడు+అట్టె= స్నేహితుడట; బక= కొంగ; మహత్తర సఖ్యంబు= గొప్పచెలిమి; ఇతనిన్= ఈ బ్రాహ్మణుడిని; పాత్రమున్= యోగ్యుడిని; చేయదె!= చేస్తుంది కదా!; ఇతనికిన్= ఇతడికి; ధనంబుల్ = సిరులు; తృప్తి+అగునట్టులు= కరువుతీరా; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం :** ఈ బ్రాహ్మణుడు ఎట్లాంటివాడైతే ఏమిలే. నాడీజంఘుడితో స్నేహమే ఈ బ్రాహ్మణుడి యోగ్యతను తెలుపుతుంది. కాబట్టి ఇతడికి కరువుతీరా ధనం ఇస్తాను'.

**వ. అని నిశ్చయించి యతనికి నాహార సంఛాదనంబులు సమీచీనంబుగా నిర్వర్తింపఁ దగువారి నియోగించి, మఱునాఁడు కార్తికపౌర్ణమాసియైన భూసుర సహస్రంబులు దన గృహంబునం బసిండిపళ్ళెరంబుల భోజనంబులు సేయను, బహుళ దక్షిణలు ప్రతిగ్రహింపనుం గల నైమిత్తిక క్రియానుష్ఠానంబులు గలిగిన నమ్మహాజనంబులలోఁ గలిపి యత్యంతాదరంబున.22**

**ప్రతిపదార్థం :** అని; నిశ్చయించి= నిర్ణయించి; అతనికిన్= ఆ బాపడికి; ఆహార= తిండీ; సంఛాదనంబులు= మంచి బట్టలూ; సమీచీనంబుగాన్=

